ఓం

శ్రీ



# రంగడి రత్నమాల.

నాళ్లచెర్వు రంగరాయ గ్రథితము.





చంద్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రితము.

కాపీరైట్

1928 వైశాఖము

## కృతిసమర్పణము.

చ॥ పదమటలంకరామ॥భవ ♦ పాపవనౌఘదవాగ్నిభీమ ప్రా
నుడువుల కందరాని యత ♦ నుప్రతిభాశుభధామ రామ! ధీ
జడధివిరాజమాన గుణ ♦ సాంద్ర కవీంద్రనుతా! పరేశ యీ
యడియడ్రొసంగు సత్కృతి స ♦ హాగొనుమా కనుమా రఘూత్తమా

## నుతిసమర్పణము.

ఆ॥ వె॥ వసుధ మాచిరాజు ♦ వంశాబ్ధిచంద్రుఁడౌ
రామమూర్తి కృపను ♦ రంగఁడిటను
రామమూర్తి కొసఁగె ♦ రత్నాలమాలను
రామనామసుధను ♦ ద్రావ మించి॥

ఆ॥ వె॥ సహనశక్తి భక్తి ♦ సత్యానురక్తియు
ధైర్యసంపదాళి ♦ దయవహించి
మావిభుఁడిదుగాత ♦ మాచిరాజాన్వయ
రామమూర్తి కెపుడు ♦ రహి చెలంగ॥

ఇట్లు విధేయుఁడు,
నాళ్లచెర్వు రంగారావు.

శ్రీరంగరంగాశ్రమము,
కొత్తపేట, గుంటూరు.



ఓమ్

ఆధునిక పద్యకావ్యము
౮–౫

# రంగడి రత్నమాల.

శ్రీరమణీమణీహృదయ ♦ జీవనజాతమరందసారవి
స్తారము గ్రోలి యెవ్వ డిటు ♦ తన్మయు డయ్యెనొ నిర్వికల్పుడై
ధీరగుణాఢ్యు నా హరిని ♦ దేశికు భూతదయామనస్కు నిం 1
జేరి భజించువాడ నిక ♦ చెల్వుగ నాదగు నిష్టసిద్ధికిన్॥

ఉ॥ శ్రీయుతమౌ జగత్త్రయిని ♦ సృష్టినొనర్చును బ్రహ్మరూపుడై
పాయని ప్రేమబూని తగ ♦ బాలనసేయును విష్ణురూపుడై
మాయము జేయు నెవ్వడిటు ♦ మాయురె నన్నిటి రుద్రరూపుడై
యాయతిలోకు డేలుత కృ ♦ పాంచితదృక్కుల నెల్లజీవులన్॥ 2

మ॥ గతిలేమిన్ పరులెవ్వరున్ భువిని నీ ♦ కంటెన్ పరానంద ! నిన్
సతమున్ ధ్యానమొనర్చు భాగ్యమును మ ♦ న్నాథా ! ప్రసాదింపు, శా
శ్వతమే యీ సిరి నిన్ భజించుటయె యై ♦ శ్వర్యం బహా, నీపయిన్
శతకం బొక్కటి వ్రాయజేయగదె నీ ♦ సాన్నిధ్యమున్ జేర్పగన్॥ 3

ఉ॥ అల్లెద పద్యమాలికల ♦ నందము చందము నింపుసొంపునన్
వల్లెయటంచు బల్కగను ♦ భక్తులు రక్తులు పండితోత్తముల్
చల్లని చూపుతో నమృత ♦ సారము జిల్కెడి శారదాంబ ! నా
యుల్లములో నపారముద ♦ ముల్లసిలంగ వెలుంగ జ్యోతియై॥ 4

ఉ॥ అల్లెడి పద్యమాలికల ♦ నన్నిటి నేటిదినంబునుండి నీ
సల్లలితాంఘ్రియుగ్మమున ♦ సాదరమొప్పు నలంకరింతు నీ

చల్లని చూపులన్ నెడలు ♦ సారసుధామృతధార నాపయిన్
జల్లుము కీర్తినొందెదవు ♦ సన్నుతిగాంతువు జానకీపతీ ! 5

ఉ॥ వ్రాసిరి గాదె మున్ను భవ ♦ బంధములన్ విదలింప శౌరిపై
భాసురపద్యరత్నముల ♦ బ్రహ్మవిహారులు పోతనాదులున్
వాసిగ వానిలో నొకటి ♦ భక్తి పఠించిన జాలు ముక్తికై
జేసెదవే నవీనకృషి ! ♦ ఛీ ! మనమా ఘనమా స్వయంకృతుల్ ॥ 6

చ॥ ఘనమని యెంచి గాదు భువి ♦ గౌరవమున్ బడయంగ గాదు నా
మనవిని నాలకింపు సఖ ! ♦ మావిభు డెంతయు భక్తి నెవ్వడేన్
తృణము నొసంగినం గొనుదు ♦ తృప్తుడనౌదు విముక్తి నిత్తు నే
నని మును బల్కెనంచును బు ♦ ధాగ్రణులే దెలుపంగ వ్రాసితిన్
ఘనతర పాపపుణ్యముల ♦ కాన్క నొసంగగ పద్యవైఖరిన్ ॥ 7

ఉ॥ రామ ! మురారి ! దానవ వి ♦ రామ ! ప్రభాకర వంశరత్నమా !
నా మొర నాలకింపుమ య ♦ నాథశరణ్య ! వరేణ్య ! శ్రీహరీ !
స్వామి ! భవత్పదాంబుజ ర ♦ జః ప్రతిభావిభవ ప్రభావమున్
వేమరు వీనులన్ వినగ ♦ బ్రీతి జనించె ననుగ్రహింపుమా ॥ 8

ఉ॥ రామ ! దయానిధే ! ద్విరద ♦ రాడ్భయ వారక ! ముక్తిదాయకా !
స్వామి ! భవాబ్ధిపోత గుణ ♦ సాంద్ర ! బుధేంద్ర ! శివా ! శివార్చితా !
నే మును సల్పినట్టి యఘ ♦ సీత విధానములన్ క్షమించి నీ
నామ సుధారసం బిడు మ ♦ నారతమున్ దమిదీర గ్రోలదన్ ॥ 9

ఉ॥ రాముని దీనబాంధవుని ♦ రమ్యచరిత్రుని నీలగాత్రునిన్
కామ ముఖోగ్ర దుష్ట గుణ ♦ కంటకునిన్ మునిలోకబాంధవున్
కామిత ప్రేమవార్నిధిని ♦ కంజదళాక్షుని చక్రహస్తునిన్
మామక సర్వ దోషముల ♦ మాపగ నిచ్చలు గొల్తు నాదృతిన్ ॥ 10

ఉ॥ రామ ! దినేశవంశజల ♦ రాశి సుధాకర ! దివ్య ! శ్రీకరా !
రామ ! శ్రితార్తిభంజన ప ♦ రాత్పర ! సాగర గర్వభంగ ! శ్రీ
రామ ! మునీంద్రహృత్కమల ♦ రాజితభృంగ ! సుభక్త సేవితా !
నే మును సల్పినట్టి యవి ♦ నీతవిధానముల౯ క్షమింపవే॥ 11

ఉ॥ రామ ! గుణాభిరామ ! కరి ♦ రాట్పరితాప భయాపహారి ! శ్రీ
రామ ! మదాంధ దోర్బల ధ ♦ రాపతి రాక్షసవంశభీకరా !
రామ ! రమాసతీహృదయ ♦ రాజితకంజదివాకరా ! హరీ !
నే మును సల్పినట్టి యవి ♦ నీత విధానముల౯ క్షమింపవే॥ 12

ఉ॥ రామ ! శశాంక సన్నిభ వి ♦ రాజిత దివ్యముఖారవింద ! సు
త్రామ వసుంధరాధిప వి ♦ తాన నుతా ! ఘనగాత్ర శోభితా !
కామముఖోగ్ర శత్రుచయ ♦ గర్వవిభంజన సాధురంజనా !
నే మును సల్పినట్టి యవి ♦ నీత విధానముల౯ క్షమింపవే॥ 13

ఉ॥ రామ ! దయార్ణవా ! శుభక ♦ రా జనకాత్మజ హృత్సరోజ జా
తామృతపానభృంగ నిఖి ♦ లాత్మ సుపూర్ణ ! సుశోభితా ! మహా

ద్దామ ! గుణాభిరామ ! బుధ ♦ ధామ ! సుధామ ! నిర్మల మనంబులో
నేమముతో భజించెద ఫు ♦ నీతుని జేయవె నన్ను రాఘవా ॥ 14

ఉ॥ రామ పదారవిందరస ♦ రక్తిని రంజిలు భక్తబంభర
స్తోమము చేరునే యెపుడు ♦ శూన్యపరీమళ సూనపంక్తులన్
శ్రీమధురంబు దివ్యగుణ ♦ సేవధి చూతఫలంబు వీడి యా
హా మనుజుం డెవండయిన ♦ నానునె వేముల పండ్ల యూటలన్ ॥ 15

ఉ॥ క్షేమ మొసంగు రేడ ! బుధ ♦ చిత్త మనోహర పుణ్యమందిరా
రామములందు నర్తన ప ♦ రత్వమునన్ వెలుగొందు రాఘవా !
నీమమునన్ త్వదీయ పద ♦ నీరజమున్ జపియింప జేయుచున్
నే మును సల్పినట్టి యవి ♦ నీత విధానములన్ క్షమింపవే ॥ 16

ఉ॥ భూమిసుతామనోహర య ♦ పూర్వకృపార్ణవ ! దివ్య తేజ ! సు
త్రామము హేశమారుతిధ ♦ రాధరరాజతనూజపూజితా !
సోమపతంగనేత్ర ! యతి ♦ సుందరవిగ్రహా ! దుష్టనిగ్రహా !
నే మును సల్పినట్టి యవి ♦ నీతవిధానములన్ క్షమింపవే॥ 17

శా॥ రామా! యేవిధి నిన్ను నే పిలిచినన్ ♦ రంజిల్లు నీ డెంద మో
రామా! యేక్రియలన్ సతంబు నెరవే ♦ ర్పన్ నీకు సమ్మోద మో
రామా! యేఘనపూర్తిలో నిను గనన్ ♦ రాజిల్లు నీ భావ మో
స్వామీ! యట్టి విధానమున్ దెలుపు సా ♦ ష్టాంగంబులన్ గూర్చెదన్॥ 18

శా॥ స్వామీ! రాఘవ! జానకీరమణ! దు ♦ స్తాపత్రయోన్మూలనా!
యేమో వేడెదనంచు నెంచకుము నీ ♦ వేదిక్కు జన్మాంతరా
సీమానంత మదీయ పాతకచయ ♦ చ్ఛేదక్రియాకారివై
యేమోయీ భయమేమి నీ కనవె తం ♦ డ్రీ! భక్తచింతామణీ! 19

ఉ॥ నెమ్మది రామపాదముల ♦ నే సతతమ్ము జపించువారు ని
త్యమ్మును రామపాదముల ♦ నాత్మదలంచుచునుండువారు, స
త్యమ్ముగ రామపాదముల ♦ తత్పరతన్ భజియించువారు, శు
ద్ధమ్ముగు రామతత్వమను ♦ ధామము జేరకపోరు రాఘవా! 20

ఉ॥ యోగుల మానసంబున మ ♦ హోన్నతమై నుతమై యధీనమై
రాగముఖోగ్రకల్మషదు ♦ రంతవిషాద లతాలవిత్రమై

భోగవిధాయియైన రఘు ◆ ముఖ్యుని పావనమంత్రమాధురిన్
ద్రాగగ ద్రాగ ద్రాగగ సు ◆ ధన్యతజెందరె ముక్తినొందరే॥ 21

చ॥ తొలుతను హర్షవారినిధి ◆ దోగుచు దూలుచు దేలుచున్ హరిన్
దలచుచు మోదమున్ గనుచు ◆ ధన్యతనొందిన నామనం బదే
తెలియక యాశకున్ దగిలి ◆ దీనతనొంది తపించుచుండె నో
బలయుత! దీనబాంధవ! శు ◆ భప్రద! నన్ దయగావు మచ్యుతా! 22

చ॥ నిరతము దేవదేవపద ◆ నీరజమందు శిరంబుజేర్చి సు
స్థిరమతి నీ కథామృతవి ◆ శేషము గ్రోలు సుభక్తబృందభా
సుర పదధూళి శీర్షమున ◆ సుంతయు దాల్ప స్థిరంబులౌ సుఖం
పురతుల దేలకుండ్రె భువి ◆ భూరిగుణాఢ్యులు ధర్మవర్తనుల్॥ 23

ఉ॥ దేని జపించి శాంకరి సు ◆ ధీపరిపూర్ణవిభూతినొందె నె
ద్దాని స్మరించి మారుతి వి ◆ ధాతృపదంబు నలంకరించె నె
ద్దాని దలంచి భద్రగిరి ◆ ధాముడు గోపన ముక్తిజెందె న
ద్దాని భజించి రామపర ◆ తత్వసుధాంబుధి లీనమయ్యెదన్॥ 24

చ॥ ఘనుడని నిన్ను గొల్చు జన ♦ కాండ మఖండ విభూతినొందకే
వనజభవామరేంద్ర ముఖ ♦ పావనమూర్తుల కందరాని నీ
ఘనపదకంజయుగ్మమునె ♦ గాంచగజేసి ముదంబు గూర్తువో
జనకసుతామనోహర ! వి ♦ శాలయశోవిభవాబ్ధిచంద్రమా ! 25

ఉ॥ చేసితి ఘోరపాపమని ♦ చెప్పగ నేటికి సర్వసాక్షి ! నే
జేసినదానికిన్ దగిన ♦ శిక్ష విధింపుము నేడె, కాని, యే
దోసములైన మాన్పు దయ ♦ తో మదిదోచి, ననున్ భరింపవే
దోసిలియొగ్గి వేడెదను ♦ తోయజనాభ ! నినున్ సదా మదిన్ ॥ 26

చ॥ శుభము లొసంగు గావుత సు ♦ శోభిత భూరిదయా సముద్రుడై
విభవ మొసంగు గావుత వి ♦ వేక విశాలహృదంతరాళుడై
యభయ మొసంగు గావుత కృ ♦ పాంచితరాజిత చక్రహస్తుడై
త్రిభువనకర్త పాలితసు ♦ ధీమణి నూమణి నాకు నిచ్చలున్ ॥ 27

ఉ॥ ఎయ్యది ద్వాదశాత్మునకు ♦ నింపుగ తేజ మొసంగుచుండునో
యెయ్యది దుష్టరాక్షసుల ♦ నేపడగింప భవంబు దాల్చునో

యెయ్యది భక్తబృందమును ♦ నిమ్మహి సమ్మతి సాకుచుండునో
యయ్యది నాపయిన్ వెస కృ ♦ పామృతమున్ చిలికించి బ్రోచుతన్ ॥ 28

ఉ॥ తీర్చితి వెట్టులో బయలి ♦ త్రిప్పుల కొన్నిటి నన్నుదేల్పగా
కూర్చితి వెట్టులో తనివి ♦ కూటికి గుడ్డకు లోటు లేనటుల్
మార్చక యుంటివేమి యణు ♦ మాత్రము, నీవు దలంచుకొన్నచో
చెచ్చెర గ్రుంకవే మొరటు ♦ చిక్కులు లోసివి గూడ రాఘవా! 29

శా॥ శ్రీరామా! గుణధామ! మానిజన హృ ♦ త్సీమాస్థితానంద! నీ
కారుణ్యాద్భుత రామనామ ప్రభనే ♦ కాత్యాయనీ శంకరుల్
సారాచారపరుల్ కుచేలముఖరుల్ ♦ సానందులై గాంచిరో
యారామానుజ పాదపంకజమున న్ ♦ ధ్యానింపగా జేయవే॥ 30

శా॥ కామార్తిన్ పరకాంతలన్ గవియగా ♦ గైకొంటి దుష్కీర్తి, యే
మోమున్ బెట్టుక నన్ క్షమింపుమని నీ ♦ ముందర్ నిలన్ నేర్తు నో
రామా ధాత్రిని నీవు దక్క నితరుల్ ♦ రక్షింపగా లేమిచే
నే మున్ సల్పినయట్టి చేష్టలను మ ♦ న్నింపంగదే రాఘవా! 31

ఉ॥ శరణని నిన్ను వేడగను ♦ శత్రులనైనను బ్రోచునట్టి నీ
బిరుదము వింటి దాశరథి ♦ విజ్ఞులు దెల్పరె మున్ విభీషణున్
పరమకృపన్ క్షమించుటలు ♦ ప్రాజ్ఞతలేని నన్ గ్రహించుటే
భరమగు నేని నీ పతిత ♦ పావననామముగూడ వమ్మగున్ ! 32

తే॥ పరమయోగీంద్ర హృద్వాస ♦ శరణు శరణు
సకల మునిజన వనచైత్రి ♦ శరణు శరణు
దురిత దానవ గజసింహ ♦ శరణు శరణు
శాశ్వతానంద చిన్మయ ♦ శరణు శరణు
శరణు శ్రీరామ గుణధామ ♦ శరణు శరణు ॥ 33

శా॥ భావింపంగదె నన్ను నీ మదిని నా ♦ పాపౌఘమున్ గూల్పగా
సేవింపన్ భవదీయదాసులను నా ♦ శ్రేయంబులన్ బెంపగా
గావింపన్ నిరతంబు సత్క్రియల నీ ♦ కారుణ్యమున్ బొందగా
దీవింపన్ గదె రామచంద్ర నను ను ♦ ద్వేలప్రభావోన్నతిన్ ॥ 34

ఉ॥ భూరి కృపాకరా! విబుధ ♦ పూజిత పాదసరోజ! భక్తమం
దార! పరేశ! శ్రీశ! భవ ♦ నాశ! సురేశ మహేశ సన్నుతా!
దూరి, దురంతఘోరవిష ♦ తుల్యమహాంబుధి దుఃఖసంసృతిన్
పారమునొందలేక పలు ♦ బాములకున్ పరితాపమొంది నా
భారము నీదెయంటి విన ♦ వా శరణంటి గజేంద్రరక్షకా! 35

ఉ॥ నిచ్చలు రామమంత్రమున ♦ నీచగుణాళిని రూపుమాపుచున్
సచ్చరితానురాగమున ♦ శాస్త్రచయంబును చర్చజేసి వే
యచ్చపు జ్ఞానమార్గమున ♦ నాత్మవిచారణజేసి యాశకున్
జచ్చినవానినిన్ గలసి ♦ సంతస మొందవె డెందమా యికన్॥ 36

చ॥ హరిహరి రామరామ యని ♦ యాత్మ నినున్ సతమున్ స్మరింపగా
వరమిడవే రఘుప్రవర! ♦ భవ్యగుణాంచితులైన ధీరులే
కరముప్రయాసమొందెదరు ♦ గాంచగ నీ నిజదివ్యరూప మే
కరములు మోడ్చి మ్రొక్కెదను ♦ కావవె దీర్పవె నాయభీష్టమున్॥ 37

ఉ॥ శౌరి ! మురారి ! మాధవ ! వి ♦ శాలదయా జలరాశి శంకరా !
భూరియతీంద్రమానసప్ర ♦ పూర్ణవిరాజిత ! సాధులోకమం
దార ! వనాటరాజవర ♦ దా ! బుధసన్నుత కీర్తిసాంద్ర నన్
ధీరుని జేయవే కృపను ♦ ధీనిధి ! శ్రీరఘువంశభూషణా ! 38

చ॥ స్థిరమని నమ్మకే ప్రకృతి ♦ చిన్మయ రాముడె నిత్యుడంచు శ్రీ
వరు పదపద్మయుగ్మమునె ♦ భావమునన్ నిలుపంగ యోగముల్
నిరుపమభక్తిజేసెడి పు ♦ నీతులె నిన్ గన దుర్లభంబు నా
తరమె నినున్ గనంగ భవ ♦ తారకరామ ! వరంబొసంగు నే
నిరతము నీకథల్ వినగ ♦ నీపదభక్తుల సేవజేయగన్॥ 30

ఉ॥ "ఏకథ లాలకించిన మ ♦ రెయ్యది వల్కిన దేని జూచినన్
నాకథనే గ్రహింపుము మ ♦ నంబున నన్నె దలంచు నిత్యమున్
నాకసుఖంబు లిచ్చెదను ♦ నన్నెయొసంగుదు" నంచు బల్కు నా
శ్రీకరునిన్ కపీంద్రనుత ♦ శేఖరునిన్ భజియించి మ్రొక్కెదన్॥ 40

ఉ॥ ఘోరభవాబ్ధిభంగములు ♦ ఘోషిల, నెంతయు గుండె ఝల్లనన్
దారసుతోగ్రనక్రచయ ♦ తాడనముల్ బడలేక యాపదు
ద్ధారకమైన తారకము ♦ దా భజియించి తరించి మించి రా
తారకరాజహంసపథ ♦ దర్శనభాగ్య మొసంగు రాఘవా ! 41

మ॥ మును వాల్మీకి "మరామరా" యనుచు దా ♦ బొల్పారచింతింపడే
గనడే ముక్తిపదంబు తుట్టతుదకున్, ♦ గానన్ భజింపంగ నీ
వనయంబున్, వరరామతారకము నే ♦ నత్యంతభక్తిన్ సదా
ఘనమౌ పాపగజేంద్రసంఘములె శీ ♦ ఘ్రం బాయమున్ జేరవే॥ 42

చ॥ కరము భజించినన్ కరుణ ♦ గావవు నా మొరలాలకింప వో
పరమమునీంద్రహృత్కమల ♦ భక్తిరసంబును మించ ద్రావ, నన్
మరచితివేమొ, గాక, కరి ♦ నాథునిమాడ్కి వనాంతరంబునన్
పరు లెవరైన నిన్ను బిలు ♦ వన్ జనియుంటివొ యార్తరక్షకా ! ॥ 43

ఉ॥ సర్వసుపర్వపూజితుని ♦ సౌమ్యగుణార్ణవపూర్ణచంద్రునిన్
సర్వమదాదిఘోరగుణ ♦ శత్రువిదారుని కృష్ణరూపునిన్

సర్వచరాచరాంతరప్ర ♦ శస్తనివాసుని శ్రీనివాసునిన్
పర్వతరాజజాప్రణుత ♦ భద్రు భజింతు నితాంతభక్తిమై॥ 44

ఉ॥ అంతములేనిసంసృతి మ ♦ హార్ణవభీకరవీచికావళుల్
శాంతి దొలంగజేసినను ♦ సారెకు రట్టులుబెట్ట జూచియున్
పంతము నాపయిన్ పతిత ♦ పావన! దీనుని బ్రోవకుంట, నా
చింతను మాన్పుమయ్య, సుర ♦ సేవిత నిర్మలపాదపంకజా! 45

చ॥ దురితములంచు నెంచియును ♦ దుష్టమనంబును ద్రోయజాలకే
పరమకిరాతకృత్యము ల ♦ పారముజేసితి నెట్లుబ్రోచెదో
శరణు మహానుభావ భవ ♦ సాగరబాడబవీతిహోత్ర, ఓమ్
హరిహరి! వాసుదేవ! దను ♦ జాంతక! రామ! రమామనోహరా! 46

ఉ॥ ఎట్టిటో నీ దయామహిమ ♦ నేగొని, రాఘవ! శత్రు లార్గురిన్
గట్టితి, భక్తసంఘముల ♦ గాంచి ముదంబును జెందుచుంటి, యి
ప్పట్టున గోర్కెపుట్టె భవ ♦ బంధవిమోచన నిన్ గనంగ జూ
పట్టుము నీవినీలమయ ♦ భాసురకాంతులతోడ నేడిటన్॥ 47

ఉ॥ దాచిన దాచికొమ్ము గుణ ♦ ధామ ! నరమ్మును నీలకాంతులో
దోచు భవత్స్వరూపమును ♦ తొందర లేదు మహానుభావ హృ
ద్గోచరమాచు సర్వశుభ ♦ కోటిని నాకిడు "రామ రామ" యా
నీ చతురాభిధానము ము ♦ నిప్రణుతా ! యెటు దాచిపుచ్చెదో॥ 48
తే॥ గీ॥ భక్తమందారుడంచు నీ ♦ భక్తులెన్న
నాశ జనియించె నీ జూడ ♦ నఖిలలోక
పాల, కరుణాలవాల, గో ♦ పాల, చలమ
దేల నా ముందర నిలచి న ♦ న్నేలు శ్రీల॥ 49
సీ॥ వనదుర్గముల కేగి ♦ ఘనతాపముల కోర్చి కూడుగుడ్డల కెంతో ♦ కుంది గుంది
ఘోర భల్లూకాది ♦ ఘోషంబులకు నెంతో దపసుల గుండియల్ ♦ దద్దరిల్ల
మొండి బండలరీతి ♦ మెండు ధైర్యముబూని యొండవానలలోన ♦ నెండి తడిసి
దుఃఖాశ్రుకణముల ♦ దోగిన కన్నుల కోటి సూర్యప్రభ ♦ ధాటి మీటు
గీ॥ వర్ణనాతీత మీపాద ♦ పంకజముల
గాంచగల్గిరి మున్నెంతో ♦ కష్టమొంది

నేడో జగమెల్ల నింతలో ♦ నిన్నుగంటి
మనుచు దగ చెప్పుకొనుచుందు ♦ రకట నాదు
పాప మదియేమొ తొలగించి ♦ భవముబాపు
సౌమ్యగుణధామ ! శ్రీరామ ! ♦ సార్వభౌమ ! ॥ 50

చ॥ ధరణి ననంతకష్టముల ♦ ధాటి నెటుల్ భరియింపలేక నీ
వరపదకంజయుగ్మమునె ♦ భావమునందున నమ్మియుంటి, న
న్నరువకు నీదు కింకరుడ ♦ నా కొసగందగు నీ కరంబు, నే
పరుడనుగాను నీకు భవ ♦ బంధవిమోచన భక్తపావనా॥ 51

క॥ ప్రతిపల్కనవర్కు మును శ్రీ
పతి హరి వైకుంఠవాస ♦ భక్తావనయర్
మతి గల్పింపుము సతమును
శ్రితజనమందార రామ ♦ చిన్మయధామా॥ 52

సీ॥ పదపటుత్వంబును ♦ విదలింప మదినెంచి గిరినదీక్షేత్రముల్ ♦ తిరిగి తిరిగి
కరగతదురితంబు ♦ బరిమార్ప నిరతంబు బహుదాన శరముల ♦ వదలివదలి

వివిధదుర్భాషలన్ ♦ వెలితియగా వక్త్రమున్ శ్రీరామసుధల బూ ♦ రించిమించి
మలినంపుదేహంపు ♦ నులికంపు దొలగింప పుణ్యతీర్థంబుల ♦ మునిగిమునిగి
కలదుష్టగుణముల ♦ మలయింప జలమున సద్గ్రంథపఠనంబు ♦ సలిపి సలిపి
కడకు నిన్ గాంచిరో ♦ గాంచకో నిరతంబు కన్నీటిధారలన్ ♦ గార్చి కార్చి

గీ॥ జన్మరహితులగుచు ♦ జయమందినారలో
గాక మరల భవము ♦ గాంచినారొ
నేడు జగమదెల్ల ♦ నిన్ గాంచినామంచు
చెప్పుచుం డ్రదెంత ♦ చిట్టి వింత ? 53

క॥ వక్షఃస్థలమున లక్ష్మియు
నక్షీణకటాక్షులీల ♦ లాదృక్కులలో
అక్షయమగు తమ వాక్సుధ
రక్షించునుగాత నన్ను ♦ రఘుకులతిలకా ! 54

సీ॥ నిత్యపవిత్రమై ♦ నిరుపమభాగ్యమై సద్గుణాకరమయి ♦ సౌమ్యమగుచు
సన్మనిమిత్రమై ♦ సజ్జనస్తోత్రమై మునివనచైత్రమై ♦ మోదమిడుచు

భక్తమందారమై ♦ ప్రకృతికాధారమై పతితులగతులకు ♦ బంధువగుచు
శంకరనుతమయి ♦ సంకటహరమయి కమలామనోజ్ఞమై ♦ కాంతులిడుచు

గీ॥ నమరు రాముని పదకంజ ♦ మాత్మలోన
విధివిరామములేకయే ♦ వేసటనక
కోరి భజియించువారికి ♦ కొదువదేమొ
భవమె హరియించి నిర్వాణ ♦ పదమె యొసగ॥ 55

ఉ॥ పొందుగ పూర్వజన్మమున ♦ బొల్చు నదృష్టము తత్తరింపగా
సందియమంతయున్ వదలి ♦ సర్వము లోకముపాలుజేసి గో
విందుమహోన్నతాత్మ సర ♦ విన్ భజియింప ప్రపూర్ణభక్తి నే
నొందితి నిత్యసౌఖ్యమహి ♦ మోన్నతి మాపతి సంతసింపగన్॥ 56

చ॥ జయజయ రామచంద్ర! బుధ ♦ సన్నుత సద్గుణసాంద్ర! శ్రీపతీ!
జయజయ శంఖచక్రధర! ♦ సజ్జన సత్సుఖదా! సుధీమతీ!
జయజయ మేరుధీర! సుర ♦ శత్రువిఖండన భక్తమండనా!
జయజయ ఘోరపాపికుల ♦ సాగరశోషణ సాధుపోషణా! 57

శా॥ నీకంటెన్ ఘను డీ త్రిలోకములలో ♦ నిక్కంబుగా రాఘవా
నాకుం దోపమి వేఱె దిక్కు గనమిన్ ♦ నానాథ ! శ్రీనాథ ! నా
శోకంబున్ విదలించు నీపదములన్ ♦ జోకన్ మదిన్ గొల్వగా
నాకీరాదె వరంబు, భూరిగుణసాం ♦ ద్రా ! రామభూపాలకా ! 58

క॥ మురహర గిరిధర భవహర
కరుణాకర ! కౌస్తుభధర ! ♦ కరివరదా శ్రీ
కర లక్ష్మీవర గంగా
ధరపూజితపాదకమల ♦ దయ నింపగదే ॥ 59

చ॥ పరులను భక్తులన్ పరమ ♦ పండితకోటిని సాధుసంఘమున్
కరము భజించితిన్ కడకు ♦ గాంచగ నైతిని ముక్తిధామమున్
మురహర ! నీకృపారస ప్ర ♦ పూరిత రాజిత దృష్టి నాపయిన్
మరలుపు మయ్య కర్మములు ♦ మాపగదయ్య శ్రితార్తిభంజనా ॥ 60

సీ॥ కరిరాజునై హరీ ♦ మొరవెట్ట నీమ్రోల సంసార నక్రమ్ము సంహరింప
ఘోర ప్రహ్లాదుండ ♦ నై నిన్ దలంతునే మాయాంధకారంబు ♦ ప్రమందిపోవ

మారుతాత్మజుడనై ♦ మర్యాద లంఘింప తమ సేవ యన్యదు ♦ ర్గమముగాగ
అల్లద్రోవది నయి ♦ యాహ్వాన మొనరింప శాత్రవనికరనా ♦ శమ్ముకొరకు
గీ॥ అయ్యా! నేను కుచేలుండ ♦ నై ధనాప్తి
కాశ జేయను హే ముకుం ♦ దా! నిజమ్ము
నీవు తండ్రివి పుత్రుండ ♦ నేను పైతృ
కము ధనమ్ము జ్ఞానము నాకు ♦ నమర నిడవె ॥ 61
సీ॥ ఓంకారశరముల ♦ నెడలునొవ్వగ జేతు రుద్రరూపముదాల్చి ♦ క్షుద్రుడనయి
బంధింతు నీపాద ♦ పంకజమ్ముల బల్మి ఘనభక్తి వల్లులన్ ♦ కార్యమూని
నిగిడించి నాదృష్టి ♦ నీరూపుపై నెంతొ కాంతిహీనుని జేతు ♦ కరుణమాలి
పరభక్త బృందముల్ ♦ సురదానవౌఘముల్ ఘనభీతినై గజ ♦ గజ వడంక
జోదుగా నే నిల్చి ♦ ఖైదుగా నిన్నుబట్టి పడవైతు నామనః ♦ పంజరమున
విజ్ఞాన రంగాన ♦ వేయుదు వ్యాజ్యంబు ధీహీను డని నిన్ను ♦ దెలుపకుందె
గీ॥ ధాత్రి లోపల నీవు నా ♦ తండ్రివగుట
వెరచుచున్నాను నిన్ను నే ♦ వెలికిలాగ

యడిగినాడను నా జన్మ ♦ హక్కుగాన
నిమ్ము నా జ్ఞానరత్నంబు ♦ నినకులేశ ! 62

చం॥ పుడమి దురంత కష్టముల ♦ ఘోరునకుఁ బడలేక యెంతో పై
వడువున తామసోక్తులను ♦ బల్కి వివేకము గోలుపోతి నో
జడనిధి కన్యకా హృదయ ♦ సారస షట్పద, రామచంద్ర ! యీ
జడుని మహాపచారమును ♦ సైపవె మీ పదభక్తి గూర్పవే ॥ 63

క॥ కాంతాకనకంబులపై
స్వాంతము లేకుండ జేయ ♦ ప్రార్థించెద శ్రీ
కాంతా ! నిను, మనమున, సు
స్వాంతుడవయి, నా మొరవిని ♦ పాలింపగదే ॥ 64

ఉ॥ కామముఖోగ్రదుర్గుణ ని ♦ కాయ మహాబ్ధి మునింగి స్రుక్కుచుఁ
వేమరు వేడుకొంటి విన ♦ వే శరణాగతలోకరక్షకా !
రామ ! మదీయపాతక ప ♦ రంపరలఁ హరియించుకర్తవై
నీ మహిమంబు జూపగదె ♦ నీరజబంధుకులాబ్ధిచంద్రమా ॥ 65

సీ॥ బ్రహ్మాండరక్షణ ♦ ప్రక్రియోపక్రమాస్థానమా విజ్ఞాన ♦ తత్వమెవడు
పద్మాలయామనః ♦ పద్మప్రభారేఖ కామోదమిడు ద్వాద ♦ శాత్ముడెవడు
నీశామనోజ్ఞాత ♦ నిర్నిద్రమారందరససారముఁ గ్రోలు ♦ భ్రమరమెవడు
సద్భక్తహృద్వనా ♦ శయవిహారానంద హంసరూపక రాజ ♦ హంసమెవడు

గీ॥ అట్టి సుగుణాభిరాము శ్రీ ♦ తాంశువదను
నీలనీరదశ్యాము పు ♦ నీతు రాము
సకలమునిజనస్తోము ప్ర ♦ సన్న నాము
ఘనుని నిల్పితి నామనః ♦ కంజమందు॥ 66

ఉ॥ మాటికి మాటికిఁ విబుధ ♦ మానససత్పథవాస శ్రీశ రా
వేటికి రాజరాజ గన ♦ వేటికి నాదగుకర్మవైర మిం
కేటికి మట్టుబెట్టవు ప ♦ రేశ యటంచు సదా నుతించి నే
దాటి విచారసీరనిధి ♦ ధన్యతనొందితి శౌరి తోడ్పడన్॥ 67

ఉ॥ ఎంతయు సంతసించెద వి ♦ దేటికి చిత్తమ ! సౌఖ్యదుఃఖముల్
వంతులు వేసి లోకములు ♦ పాలనముఁ బొనరించుచుండు ని

శ్చింతగ వీని రెంటిని ద్య ♦ జింపనివానికి స్వేచ్ఛగల్గునే
రంతులుమాని పొందుమిక ♦ రాముని నిర్గుణతత్వసంపదన్॥ 68

చ॥ పదిలముజేయగావలెను ♦ బాల్యమునందె, మహానుభావులన్
వదలక వెంటనంటి వర ♦ భక్తికుఠారము, కర్మవృక్షమున్
మొదటికె గూలనేసి భవ ♦ మున్ విదళించి, సుఖాబ్ధిలోన, స
మ్ముదమున దేలుమా హృదయ ♦ ముక్తినగంబున భద్రవాసివై॥ 69

ఉ॥ భీకరకీలికీలలకు ♦ బెగ్గిలకుండెద కగ్గకుండ నో
ప్రీకర సింహవక్త్రమున ♦ జేర్చియు నోర్చెద నాదు శీర్షమున్
వీకను మృత్యుదేవతను ♦ బెండిలియాడెద నీడుజోడుగా
గాక సుఖాంకభూతదయ ♦ గల్గనివారల గాంచలేనయో॥ 70

సీ॥ భీకరోగ్రగ్రహా ♦ భీలాంధకారంబు ధృతి రవిప్రభ నెది ♦ రింపగలదె
గజరాజఘీంకార ♦ గంభీరనాదంబు ద్విరదవైరిని భయ ♦ పెట్టగలదె
జలరాసులేకమై ♦ చలమున మిన్నంది యాప్రళయాగ్ని చ ♦ ల్లార్పగలవె
కోటిసూర్యప్రభ ♦ మీటిన త్రేతాగ్ను లీశుభక్తాళి ద ♦ హింపగలవె

గీ॥ సృష్టి ! నీ సర్వశక్తులన్ ♦ స్వీకరించి
క్రమ్మకొని రమ్ము నిండుక్రో ♦ ధమ్ము పూని
రమ్ము నీ మూలబలమెల్ల ♦ వమ్ముజేయ
కలడు నాపాల భీకరా ♦ కారమూర్తి
సౌమ్యగుణకీర్తి జయరామ ♦ చక్రవర్తి॥ 71

ఉ॥ బాణపరంపరల్ విడువ ♦ పల్మరునందున నొక్కటేనియున్
మానకసూటికిన్ దగులు ♦ మానయశోధనులూని జేయరే
మానస ! మంచికార్య మను ♦ మానములేకయె సంఘటిల్లగా
పూని భజింపవే భువన ♦ మోహనమూర్తిని కీర్తినొందవే ॥ 72

ఉ॥ పాహి రఘూత్తమా సుజన ♦ బాంధవ దుష్టనిశాచరాంతకా
పాహి గజేంద్రరాజ పరి ♦ పాలక, దేవ, మునీంద్రసంస్తుతా
పాహి చరాచరాంతర ని ♦ వాస జనార్దన పాహి యచ్యుతా
పాహి ముకుంద మాధవ య ♦ పార కృపానిధి పాహి మాం హరీ ॥ 73

**ధీరహనుమాన్.**

శా॥ శ్రీరామారమణీమనోహరుడవై ♦ క్షేమంబు లేప్రొద్దు, సు
శ్రీరంజిల్లగ భక్తసంఘములకున్ ♦ జేకూర్చుచున్, రామచం
ద్రా! రావే నను బ్రోవవే యనిన సం ♦ రక్షించు నిన్నాత్మలో
నారాధించెడి మారుతాత్మజుని నే ♦ నర్థింతు నశ్రాంతమున్ ॥ 74

మ॥ కలశక్తిన్ వెలయించు భూతనయకున్ ♦ గల్యాణముల్ గూర్పగా
జలధిం దాటి సురారులం దునిమి దో ♦ స్సారంబు దీపింపగా
యల సీతాసతివార్త రాఘవునకున్ ♦ హర్షంబునన్ దెల్పి నిన్
దలతున్, మారుతి, రామకార్యనిరతీ ♦ ధైర్యార్థినై సన్మతిన్ ॥ 75

శా॥ పారావారము బిల్లకాల్వవలె నే ♦ భక్తుండు దాటెన్ ద్రుటిన్
ఘోరాత్యద్భుతదైత్యసింహముల నే ♦ గూఢుండు దున్మాడెనో
శ్రీరామాకృతి తేజ మెవ్వడు సదా ♦ చిత్తంబునన్ జూచె, నా
ధీరోదాత్తుని వాయుపుత్రకుని నే ♦ దృష్టిన్ మదిన్ గొల్చెదన్ ॥ 76

పర్వతకథ.

చ॥ కల దొకయద్రి, దానిపయి ♦ కాంచనముల్ నవరత్నపున్ గనుల్
గలవు, విశేషచారుతర ♦ గంధయుతమ్ములు పూలదోటలున్
గలవు, మరందసారరుచి ♦ గ్రాలుఫలంబు లొసంగు భూజముల్
గల వవిగాకయే కలదు ♦ కాంత సుశోభిత భక్తకల్పమై
సలలితమౌ మహోదయను ♦ సాధుల సాకగ సాగిరం డహో
చలమున సాధిరం డికను ♦ సౌమ్యగుణాంచితులార ! వేగమే
బలమగు భక్తినూతగొని ♦ భాసిత శాశ్వత సౌఖ్య మొందగన్ ॥ 77

ఉ॥ పూనినయెత్తు పెద్దది త ♦ పోబల ముండినగాని నెగ్గ దా
పూనిక యందరున్ గొనగ ♦ బోలదు మానస శుద్ధి శాంతియున్
జ్ఞాన మహింసవర్తన వ ♦ చః పరిపాకముగల్గి శ్రీహరి
ధ్యానఫలంబె తోడయిన ♦ నయ్యదె తానయి సిద్ధి నొందెదున్. 78

గీ॥ ధీరతృప్తిగుణమె ♦ తీరుగా మదిలోన
భద్రపరచుకొన్న ♦ వారికరయ
ఘోరనరకమైన ♦ భూరి సామ్రాజ్యంబె
సరసగుణ నిధాన ! ♦ స ద్విధాన ! 79

క॥ సిరిమగనిని వాణీశుని
బరమేశ్వరిప్రాణవిభుని ♦ భక్తావనునిన్
బరతభజింతు త్రిమూర్తుల
నిరుపమవైరాగ్యభాగ్య ♦ నిధి నాకొసగన్ ॥ 80

చ॥ తనువు ధరించినందులకు ♦ దాను కరంబుల బీదసాదలన్
దనుపుటె పాదపద్మములు ♦ ధార్మికులైన బుధాళి గాంచ యా
త్రను హితమొప్ప జేయుటె య ♦ థావిధి గన్నుల సృష్టిచిత్రముల్
గనుగొనుటే మురారికథ ♦ కర్ణపుటంబుల విందుసేయుటే
మనసు నహింసతత్త్వమున ♦ మాలిమి సేయుటె, ఘ్రాణరంధ్రముల్
ఘనుని మహాత్మదివ్యపద ♦ కంజపరీమళ మానుటే, జయం

బనుచు దలంచి తత్క్రియల ♦ నాతురతన్ దగ సల్పువారలే
యనవినరాని లక్ష్మిగని ♦ యాడరె గూడరె సుస్వరాజ్యముల్. 81

చ॥ వరసురసన్నుతాంఘ్రుల న ♦ పారతరోరుమతిన్ భజించి సుం
దరతర పుష్పమాలల య ♦ థావిధి బూజలుసల్పుచుండగా
కరములు పావనంబులయి ♦ క్రాలి సుకాంతి వెలింగి హస్తిరా
డ్వరదుని పాదపంకజప్ర ♦ భావమహత్వఫలంబు నందవే॥ 82

ఉ॥ కన్నులు గల్గినందులకు ♦ గ్రమముఖాంబుజు నీలనీరభృ
త్సన్నిభగాత్రు భావనవి ♦ శాలసుశోభితకంజనేత్రునిన్
పన్నగవైరివాహనుని ♦ పాల్కడలిన్ వసియించువాని నా
పన్నభయాపహారి సుర ♦ వైరివిదారి రమామనోంబుజో
త్పన్నమరందబిందురస ♦ పానవశాత్ముని నిర్వికల్పునిన్
పన్నగరాజశయ్యుపయి ♦ భాసురలీలవరుండు వాని నే
మన్ననచే భజింతు నన ♦ మానవిలాస సతంబదేల నా
సన్నుతలీల నందకము ♦ చక్రసుదర్శనపాంచజన్యముల్

త్వన్నిజపార్శ్వముల్ గొలువ ♦ ధర్మపరాయణ భక్తబృందముల్
వన్నెతొరంగి పాహియను ♦ పల్కులు వీనుల సోకినంత నా
పన్నుల యార్తి దీర్పనయి ♦ ప్రాణపదంబగు కన్యకామణిన్
మన్నన సేయబోవుగద ♦ మాయురె యెంత దయాపరుండవో
సన్నుతసద్గుణాంబునిధి ♦ సర్వసుపర్వనుతా రమాహితా !
క్రన్నన నిన్ గనుంగొనుటె ♦ గా ఫల మన్యముగాదు మోరకుల్
నిన్ను భజింపలే రయిరి ♦ నీపదపద్మము గాంచరైరి, వి
ద్వన్నుత నా యదృష్టపరి ♦ పాక మదేమొ నుతింపనౌనె మా
యన్న ! భవత్కృపాపరిణ ♦ తాంతరచిత్తము తత్తరింప నిన్
గన్నులగంటి సంసరణ ♦ కంధి దరించితి మించి మాధవా ! 83

క॥ జలజాప్తవంశభూషణు
జలజాస్యుని జలజపాణి ♦ జలరుహనయనున్
జలదశ్యాముని రామున్
ఖిలసితరవికోటితేజు ♦ విష్ణు భజింతున్॥ 84

ఆశీ.

మ॥ ధనికుం డాతడు దాత యాత డనుచుర్ ♦ ధర్మజ్ఞు డాతండు, స
జ్జను డీతం డనుచుర్ యశస్వి యత డా ♦ శావైఖరిర్ బట్టి కో
రిన కోర్కెల్ నెరవేర్చు నీతడనుచుర్ ♦ బ్రేరేచి మైమై భళీ
శనిమాడ్కిర్ ననుబట్టి ద్రిప్పెదవె యా ♦ శాబంధభల్లూకమా ! 85

దేవీ ప్రశంస.

క॥ దినదినమొక చంపకమా,లను యుత్పలమాలనేని ♦ లలి నాకీవే
జననీ దుర్గాపరతర్, వినియోగము జేతు దాని ♦ విశ్వాత్మునర్ ॥ 86

సీ॥ పెట్టించినావమ్మ ♦ పెంపారు నన్నంబు కుంటి గ్రుడ్డికిని నా ♦ వెంటనుండి
చేయించినావు నా♦చే వస్త్రదానమ్ము ప్రియము గూర్పగ నిరు♦పేదలకును
మునుపున్న సిరినెల్ల ♦ మొదలంటగా గూల్చి దుష్టగర్వంబును ♦ దూల్చినావు
కలిగించుచున్నావు ♦ కష్టంబులను సుంత మాత ! నీధ్యానంబు ♦ మరువకుండ
బ్రహ్మంబు మొదలుగా ♦ బరగు చరాచరకోటి నీ వనుమతి ♦ గొల్పినావు
అల్లించుచున్నావు ♦ హరిని పూజింపంగ మనసారగా పద్య ♦ మాలికలను

భక్తులపాలింటి ♦ పారిజాతంబవైపరగు నిన్ సేవింతు ♦ భవమడంతు
వకార్యముల నింక ♦ నెలమిమై జేయింప నన్నిందు నిల్పితో ♦ కన్నతల్లి
తే॥గీ॥ భక్తిచే నెట్టి తపము దో ♦ ల్బామునందు
జేయజేసితొ నీ దయా ♦ శ్రీ జెలంగ
యగునె నిన్నెన్న నాబోటి ♦ యల్పమతికి
సకల బ్రహ్మాండముల బ్రోచు ♦ జనక తనయ॥ 87
చ॥ కొరత యొకింతలేదు నిను • గొల్చెడివారికి నీదువిత్తముల్
విరివిగ నిచ్చి భక్తుల వి ♦ వేకుల దాస్య మొనర్పబంపి శ్రీ
కరమగు నీ పదంబులను ♦ కౌతుక మొప్ప నుతింపజేసి, యా
హరిహర వేదమూర్తులకు ♦ నందని ముక్తిని గూర్తు వీశ్వరీ॥ 88
ఉ॥ తల్లి నినుం దలంచిన స్వ ♦ తంత్రులు కామ్యసుఖంబు లందకే
యెల్లపుడున్ లసద్విజయ ♦ హేతుకమౌ కుతుకమ్ముగాంచి వి
ద్వల్లలితో క్తి పుంజముల ♦ తత్ఫలమొంది యఖండసౌఖ్య సం
పల్లలనాపరీవృతులు ♦ ప్రాజ్ఞులుగాక వసింత్రె కాళికా! 89

మ॥ అంబ నీ చరితంబు నెప్పుడు ♦ నాస నెమ్మది నెంచు వా
డంబుధిన్ బ్రహ్లాద మట్లుగాంచు న ♦ హో సుఖాస్పదవృత్తిచే
నింబభూజ నివాసినీ కరు ♦ ణించి నీపదభక్తులన్
సంబరంపడ జేతు వందురు ♦ సాధుతన్ గణియింపగన్॥ 90

మ॥ వేనవేల్ గలవాడు నీపద ♦ విన్ సుఖించెడి భక్తులన్
గానగా జనలేడు లోని వి ♦ కారముల్ గణియించుచున్
భూనభోంతర మధ్యవాసిని ! ♦ పూర్వకర్మఫలంబు నే
పూనికన్ దొలగించి తల్లి య ♦ పూర్వమున్ దయసేయవే॥ 91

ఉ॥ క్రూరమనస్కులై నరులు ♦ ఘోరత దీయుతరిన్ మదాసువుల్
మేరునగంబుమీరు ధృతి ♦ లేనగవున్ వెదజిమ్మ సంపదల్
గోరి భవత్పదాళీ మది ♦ లో వినుతింతు సతంబు బత్తి నా
భారము డించి బ్రోవవె య ♦ పారకృపామతివై మదంబగో ! 92

ఉ॥ ఏమహనీయశక్తికి బు ♦ ధేంద్రమునీశులు భక్తులై సదా
కామితముక్తిధామమును ♦ గాంచి ముదబ్ధిని దేలుచుంద్రో, నే

నా మహనీయశక్తిని హృ ♦ దంతరమందు దలంతు నెమ్మితో
నే మునుసల్పినట్టి యవి ♦ నీత విధానములన్ క్షమింపగన్॥ 93

శివుడు.

మ॥ ధరణిన్ ధర్మపదంబు నే విడువగా ♦ తత్పాపకార్యంబె నా
దురదృష్టంబయి వెంబడింప పరులన్ ♦ దూషింప మేలౌనొకో!
వరవిజ్ఞానసుధారసం బొసగి నన్ ♦ బాలింపగా గొల్తు నిన్
కరుణాసింధుని పాపభంజనుని శ్రీ ♦ గౌరీశ్వరున్ శంకరున్॥ 94

సరస్వతి.

చ॥ చలమువహింపకమ్మ నను ♦ సత్కృపనేలగ రాగదమ్మ నా
కలిమిబలంబు సర్వమును ♦ గాంచగ నీవెగదమ్మ నేటి నా
పలుకుల నన్యు లేవిధిని ♦ వంతను నింతయు నొవ్వకుండ నో
పలుకుల కొమ్మ! నామదిని ♦ వాసముజేసి మృదూక్తులన్ సదా
వెలువడ జేయుమమ్మ నిను ♦ వేడెదనమ్మ శుభంబు గూర్పగన్॥ 95

నరసింహుడు.

క॥ శ్రీలక్ష్మీనరసింహా, పాలితప్రహ్లాద భక్త ♦ పావనచరితా
దూరింపుము నా యఘములు, పాలింపుము నన్ను గరుణ♦భవభయహరణా!

ఉ॥ కన్నుల రెప్పలేవిధిని ♦ గాచుచునుండు నవాంఛితంబుగా
నన్నును నట్టులే దివిజ ♦ నాయకసంస్తుత బ్రోచుచుంట, ని
న్నెన్నడు కన్నులారగని ♦ యీ యిహసౌఖ్యమహోన్నతుల్ సదా
సున్నగజేయు భాగ్యమును ♦ జూచు టదెప్పుడో దెల్పుమో హరీ! 97

ఉ॥ ఏలుచునుంటివంచు నను ♦ నెంతయొ ప్రేమ, వచింపనేల యీ
మాలమె సాక్షి, కాని, నిను ♦ మౌనవ్రతంబున బూజసేయగా
జాలినశక్తి నాకొసగి ♦ సాయమొనర్పుము విశ్వరూప, నా
పాలవసించి సంసరణ ♦ భారము నీవె వహించి నిత్యమున్॥ 98

ఉ॥ జాలిదలంచి నాయెడల ♦ సర్వజనంబులు నిన్ నుతింప, నీ
కేలును నాకొసంగితివి ♦ కేవలమున్ కరుణామయుండవై

బాలుడ, మీ కృపాలహరి ♦ వర్ణనజేయగ జాలనయ్య యీ
మాల గ్రహింపుమయ్య బుధ ♦ మాన్యచరిత్రుడవయ్య రాఘవా! 99

ఉ॥ రంగని రంజనంబు మహి ♦ రంగమునందున గన్గొనంగ శ్రీ
రంగరమామనోబ్జమక ♦ రందరసామృతరాజి గ్రోలు సా
రంగడకా విభుండు కవి ♦ రాజులు మానులు యోగిపుంగవుల్
భంగమునొంది పర్వులిడ ♦ పామరు లెంతటివార లెంచగన్॥ 100

చ॥ పదపద మావసంబ వడి ♦ బంధుకళత్రసుతాదిమిత్రులన్
వదలి, హృదంతరాళమున ♦ భవ్యగురున్ రఘురాము గొల్వగా
వెదకు టదేల బాహ్యమున ♦ వెట్టివలెన్, మృగతృష్ణలోన దా
ముదకము ద్రావి సంతసము ♦ నొందెడివారు గలారె ధారుణిన్॥ 101

## వందనము.

ఉ॥ వందన మోరమాహృదయ ♦ వారిజసారమరందభృంగమా!
వందన మోదురంత భవ ♦ పాపభుజంగవిహంగరత్నమా!

వందన మోయఖండగుణ ♦ వారిధి వారిజపత్రదృగ్రమా !
వందనమయ్య భక్తకుల ♦ వత్సల కోవిదకల్పభూజమా ! 102

క॥ దండమయా విశ్వేశ్వర, దండమయా విశ్వపాల ♦ దాసవిలోలా
దండమయా విశ్వాత్మక, దండము కోదండరామ ♦ తారకనామా ! 103

మంగళము.

ఉ॥ మంగళమయ్య మీకు ముని ♦ మానససత్పథవాస భాసురా
మంగళమయ్య మీకు నన ♦ మానధురంధర లోకభీకరా
మంగళమయ్య మీకు నను ♦ మాననిషేధసుధీవశీకరా
మంగళమయ్య మీకు జయ ♦ మంగళముల్ గొనుమా రమావరా ! 104

ఉ॥ ఎన్నదరంబె నాకు జగ ♦ దీశ రమేశ్వర నాళ్ళచెర్వు రం
గన్నను పద్యమాలికల ♦ నల్లగజేసిన హేతు వేమొ, మా
యన్న యెరుంగ నీకె తగు ♦ యజ్ఞుడ నెంతటివాడ నేను నిగ్
సన్నుతిజేయ భానుకుల ♦ సాగరపూర్ణశశాంక రాఘవా ! 105

క॥ సురవినతచరణజలరుహా, వరమునిహృదయసరసిజని ♦ వాస ! కపాలీ
గిరిరాట్సుతనుత హరి ముర,హర జితమృగధరముఖకమ ♦ లా రిపుకాలా !

క॥ రాధాకృష్ణా కేశవ, మాధవ బ్రహ్మేంద్రరుద్ర ♦ మండలగేయా
భూధవ భూసురవరభ,క్తాధారా సర్వదైవ ♦ తాంచితపాదా॥ 107

క॥ శ్రీలోలా శ్రితజనతరు,మూలా గోపాలబాల ♦ మోహనచేలా
శీలా ధరణీపాలా, తూళితఖలజాల రామ ♦ చంద్రనృపాలా ! 108

సమాప్తము.

గద్య.

ఇయ్యది శ్రీ నాళ్ళచెర్వు వంశపయఃపారావార పూర్ణహిమకరుండును శ్రీనివాస
దివ్యపదపద్మమకరందపానమత్తచిత్తుండును శ్రీనరసింహరాయ
రామాబాయాంబికాగర్భశుక్తిసంపుటచతుర్థలసన్మౌక్తాయమానుండును సార్థకనామధేయుండును నగు
రంగన్న ప్రణీతము.